అప్పురాయలు వెనక్కి తిరిగి కూర్చున్నాడు.

అప్పు కవికి నిరాశ కలిగింది, తన అప్సరసజ్ఞత కొరగానిదయి పోయిందనీ నొచ్చుకున్నాడు. తుది ప్రయత్నంగా మరొక్క మాట అన్నాడు.

"కరుణాపయోనిధీ! అప్పులు అడిగే వేళ నువ్వు ఆడిన సరసాలన్నీ మనోహరమైన రూపాలు ధరించి అందమైన కన్యలుగా స్వర్గంలో విహరిస్తున్నాయి. వారినే అప్సరస లంటారు" (అప్సరసాఐన్నమాట భ్రష్టమై ఈ పేరు వచ్చింది) అన్నాడు.

వెంటనే అప్పురాయలు సింహాసనం మీంచి లేచి దిగి అప్పుకవి వేపు బయల్దేరాడు.

కొంపదీసి తంతాడా ఏవిటి చెప్మా అని అప్పుకవి శంకించాడు. గాని ఆవరకే అప్పురాయలు వచ్చేసి ఆయనను గాఢాలింగనం చేసుకున్నాడు.

"మహాకవీ, మీ మహా కావ్యాలు నన్ను ముగ్ధుణ్ణి చేశాయి. నేను గద్దె దిగిపోయి, మొహం తిప్పినపుడల్లా ఆ దిశనున్న పరగణాలు మీకిస్తూ వచ్చాను. ఇపుడు నాలుగు దిక్కులూ మీవే.... దిక్కున్నచోట అప్పు తెచ్చుకోండి. దిక్కేమిటి నా రాజ్యం అంతా మీదే. ఈ రాజ్యంలో మీ చిత్తం వచ్చినవారిని, ఓపినంత అప్పు అడిగి పుచ్చుకోవచ్చు. ఆ హక్కులు దారాదత్తం చేస్తున్నాను. వాటితోపాటు నా పాత బాకీలు కూడా మీవే. అంతేకాదు. ఇహనుండి మీరే నాకు అప్పులు ఇవ్వాలి. లేకపోతే తెచ్చి ఇవ్వాలి. ముందో రెండు పుంజీల వరహాలివ్వండి" అంటూ ఆయనను అభినందించి సత్కరించాడు అప్పురాయలు.

* * *

"ఆహా! నాటి విశాల హృదయాలు, ఆ ఔదార్యాలూ, ఆ అప్సరసజ్ఞత ఏవి - అప్పన్నా - ఏవి? అన్నాడు అప్పారావు కథలోనించి గాఢంగా నిట్టూరుస్తూ.

"కతలకేంగాని ముందర పన్జూడండి. ఇప్పుడు రాజుగారు ఇటే పొచ్చినా తిన్నగా అప్పులనరసయ్య కోసం ఎదిరింటి కెళిపోతాడు గదా. మనవెలా ఆపడం. ఆపి అడిగినా, ఆలోగా అప్పులనరసయ్య మన్నిచూసి తగులుకుంటే ఎలా?" అన్నాడు అప్పన్న.

అప్పారావు జాలిగా నవ్వాడు. "నీకు స్ట్రాటజీ తెలీలేదోయ్ అప్పన్నా. అప్పులనరసయ్యున్నది బాకీరావుగారి అరుగుమీదగదా....బాకీ రావుగారికీ మన రాజుగారికీ చూడగానే కౌగలించుకునే అలవాటు లేదు. అప్పో బాకీయో తేలని మొత్తం ఒకటి వాళ్ళిద్దరిమధ్యా నలుగుతోంది. అంచేత రాజుగారు దూకుడుగా వచ్చినా, అరుగుమీద బాకీరావుని చూసి తగ్గి తమాయించుకుని అప్పుల నరసయ్యకోసం బీటెయ్యడానికి వెనక్కి వెనక్కి నడుస్తూ ఈ కిళ్ళీబడ్డీ దగ్గరికే వస్తాడు. మనం ఇక్కడ మాటేశా వని తెలీక. వెంటనే మనం వేటాడేస్తాం. అంథా స్ప్లిట్ సెకండ్ ఆప రేషన్. మాడర్న్ అప్పాలజీ"అన్నాడు అప్పారావు నీరసంగా నవ్వుతూ.

దూరంగా నల్లకోటు, అందులో ఋణదరాజుగారు కదలడం జరి గింది. అప్పారావూ అప్పన్నా బడ్డీచాటుకు జరిగి కాసేపు రాజుగారికేసి కాసేపు ఎదురింటి అరుగుమీది ఎరకేసి చూస్తున్నారు. లోకంలో గడియారా లన్నీ ఆగిపోయాయి. అప్పారావు గుండెలోదే దేశ అసేవకుగాను ఘాటీగా కొట్టుకుంటోంది.

ఋణదరాజుగారు ఈలపాట తక్కువజేసి మంచి హుషారుగా వచ్చేస్తున్నాడు. అప్పులనరసయ్యని కళ్ళారా చూడాలని ఎన్నాళ్ళనించో ఆయన హృదయం తహతహలాడి పోతోంది. ఇవాళ మంచి మంచి అవకాశాలు కలిసొచ్చాయి. ఇందాక, 'దగ్గిర్నావచ్చి— ఆపేదాకా— గుర్తు తెలీకుండా — తలపాగా చుట్టుకు—మారు వేషంలో—మీదపడ్డ అప్పులసామి గాడిది మినహా. వెధవపీనుగ చూస్తూండగా పాతిక రూపాయలు పట్టుకుపోయాడు అరగంటలో ఇస్తానని....

ఋణదరాజుగారు కిళ్ళీబడ్డీ దాటుతూ వుండగా అప్పన్న కంగారు కొద్దీ ఆయన ఎదటపడి అటకాయించేయ బోయాడుగాని అప్పారావు సకాలంలో అతన్ని ఆపాడు. లాకాయ లూకాయ దెబ్బతగిల్తే, కథ అడ్డం తిరుగుతుంది. దెబ్బతిన్న పులిని ఆకట్టడం కష్టం-ఓపిక కావాలి. నిగ్రహం వుండాలి....

రాజుగారు కోవెలదాక ధాటీగావెళ్ళి కొయ్యబారిపోయారు. అలా నిలబడి పోవడం లాభసాటిగాదని మళ్ళీకోలుకొని బాకీలరావుని శపించి నెమ్మదిగా వెనక్కి వెనక్కి అడుగువేసి కిళ్ళీ బడ్డీ చేరేవరకూ——

దండాలు బాబయ్యా....దండాలు. ఛీ వెధవా నువ్వా. నా దగ్గ....మా బుల్లి కొంట్లో....బాగు....రేం....లేదు....అది కాదు బా....బోయ్ నువ్వె క్కడ దాపురించావు....అనే ఋణగుణ ధ్వని "ఒరేయ్ అప్పన్నా నీ కేం బుద్ధిలేదూ" అన్న అప్పారావు కేకతో సర్దుకున్నాయి.

నమస్కారం రాజుగారూ అన్నాడు అప్పారావు.

నమస్కారం అన్నాడు రాజుగారు నీరసంగా.

"ఈ వెధవకి సమయం సందర్భం మంచీ మర్యాదా తెలీవండి. అనెడ్యుకేటెడ్ బ్రూట్" అన్నాడు అప్పారావు.

"వెధవ్వేషాలు కుదరవు. నాదగ్గి రొందకాదు రెండొందలు కూడా లేదు" అన్నారు రాజుగారు కంగారుగా.

అప్పారావు షోగ్గా వయ్యారంగా వెనక్కి తిరిగి తన వెన కెవరో ఉన్నారన్నట్టు చూశాడు. ఇటు తిరిగి నవ్వాడు. "యూమీన్ మీ....నా వెనకెవరో ఉన్నారనీ వారిని మందలిస్తున్నారనీ అనుకున్నాను...." అన్నాడు.

రాజుగారు ధుమధుమలాడుతూ ఎదురింటివేపు చూస్తున్నారు. కంగారుగా అటూ ఇటూ చూస్తున్నారు.

"డుయూనో! మీకు తెలుసా? విన్నారా" అన్నాడు అప్పారావు.

రాజుగారు అనుమానంగా వెనక్కి చూశారు.

"మీరు క్షణం క్రితం అద్భుతమైన హాస్యపు మాటన్నారు. వన్నాఫ్‌ది ఫైనెస్ట్ జోక్సు ఎవర్. నేనే అయితే అది రాసుకొని ఎలక్షన్ ప్రాపగాండాలో వాడేదును" అన్నాడు అప్పారావు.

"ఈ శషభిషలు కుదరవు.... నాకు టైమైంది పోతున్నాను" అన్నారు రాజుగారు దశదిశలా కంగారుగా చూస్తూ.

"ఐనో ఐనో. టైము చాలా విలువైనది. ఇపుడు మీరు ఆ వందా ఇచ్చి మాటదక్కిస్తే అది ఓ ప్రాణాన్ని—ఒకటేమిటి రెండింటినీ కాపాడుతుంది—ఆ రెండూ పెళ్ళాడి ఇంకోపిల్ల ప్రాణాన్ని పెడతాయి. అదేమో లక్షలార్జించి—వివరాలెందుకులెండి ట్రూతీజ్ స్ట్రేంజర్ దాన్ ఫిక్షన్. నేన్నిజం చెప్పినా మీరు నమ్మరు.

రాజుగారు మళ్లీ వీధి చివరకి తొంగిచూస్తే "నా దగ్గర డబ్బు లేదు" అన్నారు.

"డబ్బు దేవుందండి కుక్కనక్తే రాల్తుంది. మీరు ఊ అంటే దేన్నో తందాం."

"అసల్నే నెందు కివ్వాలయ్యా మీ అందరికీ" అన్నాడు రాజుగారు కోపంగా.

"అప్పన్నా చెప్పరా" అన్నాడు అప్పారావు.

అప్పన్న సంచీలోంచి సరంజామా తీశాడు.

"చిత్తం మా యిద్దరితాలూకు బంధువుల్లోను నిన్న సాయంత్రం వరకుఇద్దరో ముగ్గురో పోయారండి, ఈపాటి కింకో ఇద్దరు పోయుంటారు. ఇంకిద్దరో ముగ్గురికో ప్రాణంమీదకొచ్చింది. ఇవిగో టెలిగ్రాములు

ఇవిగో ఈ రెండూ ఉత్తరాల్లా వున్నాయేగాని ఇవీ టెలిగ్రాముల్లాటివే. మేష్టారిల్లు వేలం వేస్తున్నారు. అప్పారావు గారి తమ్ముడు పరీక్షకి ఫీజు ....రిక్షావాని బీదబాలికకు మందు...." అంటూ చెప్పుకుపోతున్న అప్పన్న అప్పారావు గావుకేకవిని, తరువాత చుట్టూ చూసి కెవ్వుమన్నాడు.

అప్పారావు గావుకేక పెట్టడం నిజమే.

అప్పారావునీ అప్పన్ననీ కలుసుకోవాలనీ, వాళ్ళిద్దరిచేత కొన్ని ఋణపత్రాలమీదా సమన్లమీదా ఆటోగ్రాఫులు పెట్టించుకోవాలని చాలా కాలంగా సరదాపడుతున్న అభిమానులు కొందరు హఠాత్తుగా నేలలోంచి మొలిచినట్టుగా అక్కడ సంభవించి వారిని చుట్టుముట్టడించారు. వారంతా ఋణదరాజుగారిని ఆశ్రయించగా ఆయన కనికరించి ఈ భేటీ ఏర్పాటుకు ఈ విధంగా దోహదం చేశాడు.

ఎంతో ఆప్యాయంగా, తమ తమ శిల్ప సంప్రదాయాల ప్రకారం లొట్టలువేస్తూ ఎరని చూస్తున్న, పులిని చూస్తున్న, వేటగాణ్ణి చూస్తున్న ఎరనీ పులినీ వేటగాణ్ణీ చూస్తున్న, పులిని చూస్తున్న, వేటగాణ్ణి చూస్తున్న ఎరని మేస్తున్న, పులిని కాస్తున్న....అ యొక్క సన్నివేశం నేత్రానందంగా మహోజ్వలంగా ఉంది. అయినప్పటికీ సమావేశకర్త ఋణదరాజుగారు ఎందుకో హఠాత్తుగా కదిలి, తీవిగురించి లేనిపోని పట్టింపులు పెట్టుకోకుండా సభవారి కృతజ్ఞతాభివందనాలు అందుకోకుండా రివాజైన దానికన్న ఎక్కువ వేగంతో బయల్దేరి వెళ్ళిపోయారు. అక్కడి సభవారు చాలామంది, అయ్యో మహోపకారి వెళ్ళిపోతున్నాడేల అని తెల్లబోయి చూడసాగారు.

వెనకాలవేపునుంచి బాకీరావుగారు ఉత్సాహంతో ఋణదరాజుగారి కోసం వస్తున్నవైనం వీరు గమనించలేదు. ఆ సంరంభంలో తమకు ప్రముఖపాత్రలేదని తలచి చిన్నబుచ్చుకున్న అప్పారావు గల్లంతైపోవడంకూడా వారు గమనించలేదు.

"హే ఋణవాన్! ఏది ఎర? ఏది పులి? ఏది గురి, ఏది బలి! అంతా నీ లీల" అనుకున్నాడు స్వామి ఋణానంద—తాను ఎంతో ఆశతో ప్రేమతో దరిచేరబోయిన ఆ మహాసభ, తనని చూడగానే వందన సమర్పణలేకుండా ముగింపు చెందడం, జనం కకావికలై పరుగు లెత్తడం చూసి.

## ఆ చేతి చేత....

భ్రామ్మ వంట చేస్తూ ఉండగానే, అక్కడ తారట్లాడి, ఆవిడ కన్ను మరగేసి వత్తులపెట్లో డబ్బులు చెక్కేయ్యడంలో భీమశంకరంగారు చిన్నపుడు సిద్ధహస్తుడు. ఆ రోజుల్లో వెనకబడ్డ స్నేహితులకు ఈ విద్యా కిటుకులు ఉపదేశించి గురువనిపించుకున్నాడు. బడిఎగేసి కాలవగట్లవెంట బీడీలు కాలుస్తూ రోజులతరబడి తిరిగినా గోడ కట్టినట్టు అబద్ధాలు చెప్పి ఎవరికీ అందకుండా నిభాయించుకోగలిగిన సాటిలేని మేటి మొనగాడు. దరిమిలా పెద్దవాడయ్యాక, ఆఫీసుకు, చెప్పిన జబ్బు చెప్పకుండా సెలవు పెట్టి నెగ్గుకొచ్చిన ధీశాలి. అమెరికన్ పుస్తకాల సలహాలతో ఇంకా ఎన్నో పరిస్థితులకు తట్టుకోవడం, సమస్యలను ఎదుర్కోడం, ఎదిర్చి నిలబడడం నిలచి పరిష్కరించడం నేర్చుకున్నాడు. చిన్నప్పుడు కంఠతా వచ్చిన పదమూడో ఎక్కంలాగే ఇదీ క్రమేపీ రూపుమాసింది. ఆ రోజులు వెళ్ళిపోయాయి.

అంతటి భీమశంకరంగారు ఏభయ్యో పడిలో పడ్డాక, ఒక ఆదివారంనాడు, ఎదుట గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్న పాతికేళ్ళ కుమారరత్నం వంక బాధగా చూస్తూ పడక కుర్చీలో పడుకుని సతమతమవుతున్నాడు.

"చలేస్తోంద్రని చెప్పి చూడరా నాయనా" అన్నాడు చివరికి.

"శాలువా కప్పుకోమందండి. లేపోతే సావిట్లోకొచ్చి పడుకో మంటోందండి" అన్నాడు కుమారుడు విజయంగా.

"అఘోరించకపోయింది.... అయినా కాపోయినా ఏం మహిళలురా అబ్బాయి. ప్రాణాలు తోడేస్తున్నా రనుకో. మొగుడు వెధవ ఆదివారం పూట కాస్త ఊళ్ళో కెళ్ళాలంటే వీళ్ళ నిఘా ఏమిట్రా" అన్నాడు భీమశంకరం ప్రాణం విసుగెత్తిపోయి.

కొడుకు తలవంచుకున్నాడు మాట్లాడకుండా.

"టైమెంతయిందిరా?"

"మూడున్నరండి"

"అయ్య బాబోయ్! రైలు కింక గంటన్నర ఉందన్న మాట" అన్నాడు భీమశంకరంగారు.

ఆయన ఆ ఉదయం 9 గంటల నుంచి మూడున్నరవరకూ పదిసార్లు టైమడిగి తొమ్మిదిసార్లు అయ్యబాబోయ్ అన్నాడు. ఒకసారి అబ్బా అపుడే రెండయిందిరా అన్నాడు. క్రితం రాత్రి తొమ్మిదినుండి ఆరోజు ఉదయం 7 గంటల వరకూ కొడుక్కి డబ్బివ్వమనీ, 7 నుండి 9 వరకూ తన పంచె, చొక్కా కండువా తన ముఖాన తగలెయ్యమనీ భార్యను పరిపరివిధాల బతిమాలుతూ వచ్చాడు.

ఆరు మూడయేది మూడు ఆరయేది "అ యాభై" మాత్రం ఇచ్చేది లేదని ఆవిడ ఖరారుగా చెప్పేసింది. "కట్నం లేకుండా పిల్లని చేసుకున్నాం కదా: ఆ మాత్రం అల్లుడు గదా అని ఓ నూటపదహార్లు పండుగ పేరు చెప్పి వాళ్ళివ్వరాదా; మన వెధవాయ్ని పెళ్ళాంచేత అడిగించరాదా." అని ఆవిడ రాత్రి గట్టిగా అనేసింది.

మెల్లిగా వెధవా అంటే గట్టిగా ముండ అనే తరహా మనిషి భీమశంకరంగారి భార్య.

పండక్కి అత్తారింటికివెళ్ళి మళ్ళా పట్నంవెళ్తూ కొడుకూ కోడలూ ఇక్కడ దిగారు. ఓ నెల జీతం ముందే తీసుకుని ప్రయాణాలకు ఖర్చు పెట్టేసినందువల్ల, పట్నంలో కొంప చేరగానే ఆవగింజ దగ్గర్నుంచి తడుముకోవాలని బండి దిగిన గంటలో కొడుకు విన్నవించుకున్నాడు. ఉన్న డబ్బు రైలుకి కటాకటిగా సరిపోతుందని కూడా చెప్పుకున్నాడు. భీమశంకరంగారి గుండె కరిగిపోయింది. ఆయనభార్య ససేమిరా కానీ ఇవ్వడానికి వల్లకాదంది. ఆపాటిజాలి తనకీ ఉందనికూడా చెప్పింది.అవతల కొడుకూ కోడలో విని ఏమనుకుంటారో అని భీమశంకరంగారి బెంగ.

"సరేలే. నువ్వు ఇవ్వద్దు పొద్దున నేనే చూసుకుంటా" అన్నాడు చాలా గంభీరంగా.

ఆదివారం ఉదయం ఆయన లేచి అప్పుకు వెళ్ళబోయేసరికి చొక్కా పంచె, కండువా కనబడలేదు. పెట్టె తాళం వేసుంది.

"ఔనే. నా చొక్కా ఏదీ!" అంటూ వంటింట్లోకి వెళ్ళాడు.

"ముందు స్నానం చెయ్యండి." అందామె.

శంకరంగారు స్నానంచేసి కట్టుకున్న పంచె తడిపేశాడు. ఓ అంగవస్త్రం, తువ్వాలూ అందించిందావిడ. అవి కట్టుకుని, దేవుడికి దీపం వెలిగించి, ఓ పువ్వు ముక్క పడేసి లేచాడు. ఉట్టి వెనక చిలక కొయ్యకి తగిలించి ఉన్నాయి తన ఆఫీసు దుస్తులు. కాస్త ఆశ్చర్యపడుతూ తీసుకోబోయేసరికి "ఆగండి. ఆదివారం పూట ఎక్కడికి కెళ్తారు?" అందామె.

"పనుంది"

"నాకు తెలుసు ఆ రాచకార్యం. మీరేం వాడికి డబ్బు తెచ్చివ్వక్కర్లేదు. అంత అవసరమయితే ఇక్కడింకొక రోజు ఉండి, అత్తారింటి నించి తిగె టపా మీద తెప్పించుకోమనండి."

"అది కాదే...."

"మీరు ముందు వీధరుగు మీద కెళ్ళి కూర్చుని పేపరు చదువుకోండి, నాకు పనుంది. పాలకాయలూ జంతికలూ చెయ్యాలి."

శంకరంగారు నోరు మూసుకుని వీధరుగు మీద కెళ్ళిపోయాడు.

కొడుకు అక్కడ కూర్చుని అలోచిస్తున్నాడు.

ఎన్నడూ నోరెత్తి అడగనివాడు ఇన్నాళ్ళకి తనని అడగడం, తను ఇవ్వలేని పరిస్థితిలో పడడం చాలా బాధ కలిగించింది శంకరంగారికి.

"బాబూ ఇవాల్టికాగి, రేపు వెళ్ళరాదురా, ఇవాళ ఆదివారం, రాఖం జతపడింది కాదు" అన్నాడు ఎంతో లాలనగా.

"లేదండీ నాన్నగారూ. రేపే జాయినయిపోవాలి."

శంకరంగారు దిగాలుగా కూలబడ్డాడు కుర్చీలో. తను ఒక్కడుగు అలా వెళ్ళొస్తే ఎవడి నెత్తోకొట్టి యాభై కాదు వందైనా పుట్టించ వచ్చునని ఆశ ఉంది. కాని, ఇంట్లో ఆడది మొండికెత్తి బోయి, తన చొక్కా వంచె వంటింట్లో పెట్టుకుని ఇవ్వను పొమ్మంటే ఎలా చావడం ?....తాలూకా ఆఫీసులో కాషియర్ గిరీ అఘోరిస్తూ అంగోస్త్రం కట్టుకు ఊరేగడం అంటే ఒళ్ళు చచ్చిపోయినట్లుంది. అబ్బాయికే చీటీ రాసిచ్చి పంపుదామంటే మనసొప్పలేదు. వాడిప్పటికే ఎంతో మదనపడి, డబ్బు వద్దులెండి నాన్నగారూ అంటున్నాడు.

కన్న కొడుకుకి కానీ డబ్బివ్వలేనివాడినా అనుకుని ఒక్కసారిగా తెగించి, వంటింట్లో కెళ్ళి "నాకు పనుంది. ఆ గుడ్డలివిలా పారెయ్"అన్నాడు

గంభీరంగా. ఆవిడ వల్ల కాదు పొమ్మంది అంతకన్న గంభీరంగా-ఆ తర వాత, శంకరంగారికి చిన్నప్పటి విద్యలు జ్ఞాపకం వచ్చాయి. అక్కడే కాసేపు తారట్లాడి చూశాడు. లాభంలేక పోయింది. ఆవిడ వెయ్యి కళ్ళు పెట్టుకుని చూస్తూ ఉందాయె.

తన చిన్ననాటి కళావైదగ్ధ్యం ఈనాడు ఎందుకూ కొరగాకుండా పోయిందని విచారించాడు శంకరంగారు. ఏడెనిమిదేళ్ళ కొడుకున్నా,కాస్త తరిఫీదు ఇచ్చి, ఇలాటి సమస్యలను చులాగ్గా ఎదుర్కోవచ్చు. ఉన్నవాడు పాతికేళ్ళవాడాయె, వాడికి ఇప్పుడు టోకరా విద్య ఎలా నేర్పడం?

కాసేపు ఆలోచించి కొత్తరకం ఎత్తువేశాడు ఆయన. వీధరుగుమీద కూర్చుని కోడలు పిల్లని పిల్చాడు. "అమ్మాయి! వంటింట చిలక్కొయ్యని నా చొక్కా పంచా ఉన్నాయిగాని, కాస్త పట్రా అమ్మా"అన్నాడు,

కోడలు మళ్ళా రాలేదు. అవిడే వచ్చింది. "మీకాదు చెప్పింది. ఏమిటా కుట్రచేష్టలు?" అని కూకలేసి వెళ్ళిపోయింది. కోడలు విస్తు పోయింది.

భోజనా లయ్యాయి. పదకొండయింది. పన్నెండయింది. ఒంటి గంట కూడా అయినా, ఆవిడగారు కునుకు తీసేటట్లు కనబడలేదు. మళ్ళా నిప్పంటించి, పిండి వంటలు ప్రారంభించింది - కొడుకూ కోడలూ సాయంత్రం వెళ్ళి పోతున్నారుగదా అని.

శంకరంగారికి నిద్ర రాలేదు. కాలుకాలిన పిల్లిలా తిరుగుతున్నాడు. కొడుకు నిద్రపోతున్నాడు.

ఆయనకో ఊహ తోచింది. వాడిచొక్కా.... వేసుకుంటే?.... పంచె లేదాయె పొడుగు పంట్లాంలే ఉన్నాయి.

శంకరంగారికిసిగ్గేసింది. అయినా సరే అని ఓ పంట్లాం తొడుక్కు న్నాడు. చొక్కాలన్నీ చిత్రంగా ఉన్నాయి. పట్నం చొక్కాలు కాబోలు ఒకటీ బొడ్డు దిగదు= రవికెల్లా ఉన్నాయి.

అద్దంలో చూచుకున్నాడు. నవ్వొచ్చింది. తను నవ్వేలోగానే ఇంకో రెండు గొంతులు, ఒకటి కిలకిల, ఇంకొకటి ఫెళఫెళ నవ్వాయి. ఆ నవ్వుకి లేచిన కొడుకు కూడా పకపక నవ్వాడు.

శంకరం గారికి ఒళ్ళు చచ్చిపోయినట్లయింది. దొంగతనం చేస్తూ పట్టుబడ్డట్టనిపించింది. బీరువాకింద చూశాడు, దూరిపోదామని. కోడిగుడ్డు దీపం ఉండే గూట్లోకి చూశాడు. అందులో ముడుచుకు కూర్చుందామని... ఒక్క క్షణం ఆగి ముగ్గురివంకా చూశాడు. ఒక్క పెట్టున తనూ నవ్వెయ్యడం ప్రారంభించాడు.

నవ్వులయిపోయాక, తన పంచె, చొక్కా యియ్యమని అడిగాడు భార్యని.

మీ కేం మతిపోయిందా అందామె.

మళ్ళా అంగవస్త్రం - తువ్వాలు కట్టుకుని, అరుగు మీద కుర్చీలో చేరాడు. శంకరంగారు -- సృష్ట్యాదినుండి ఏ పురుషుడూ దేనికీ పడనంతగా విరహతాపం పడుతూ.

మూడున్నర అయింది. రైలుకింక గంటన్నర పైముంది. ఎలా డబ్బు పుట్టించడం?

వీధి వెంట ఓ కుర్రాడు వస్తున్నాడు అట్టపెట్టెని తన్నుకుంటూ. వాడు తెలుసు శంకరంగారికి. పెద్ద ఊహ పోయింది. కుర్రాణ్ణి పిలిచాడు. తెగించాడు. "ఒరేయ్‌బాబు నువ్వు సుబ్బారావు గారింటికెళ్ళి అర్జంటుగా....అహకాదు, మా ఆఫీసు జవాను నాగన్నింటికెళ్ళి ఇక్కడున్నట్లుగా చిటెకెలో కేకేసుకురా, నీకు రేపు గాలిపడగ కొనిస్తా" అన్నాడు.

ఏకళ నున్నాడో వాడు సరేనని వెళ్ళాడు. మూడున్నర నుండి నాలుగుదాకా శంకరంగారి గుండెకాయ నిమిషానికి మూడువందలసార్లు కొట్టుకుంది.

నాలుగింటికి నాగన్న వచ్చి ఏం బాబూ అనగానే స్థిమిత పడింది.

"ఏవోయ్ నాగన్నా! నీకు పుణ్యం వస్తుంది. రేపు రూపాయొస్తుంది కాని, వెంటనే సుబ్బారావు గారింటికెళ్ళి అర్జెంటుగా అమాంతంగా ఒక్క యాభై రూపాయలు అడిగి తెచ్చిపెట్టు. రేపు ఆఫీసుకు రాగానే ఇస్తానని చెప్పు" అన్నాడు.

నాగన్న కళ్ళు పెద్దవిచేసి, "అంత డబ్బు నాకిత్తారా బాబయ్యా. తవరే ఒక్కడు గెల్లరాదూ?" అన్నాడు.

"వెళ్లనుకాని పంచె చొక్కా....దానికేంలే. నేచెప్పాననని చెబుదూ ఇస్తాడు."

"పోనీ సీటీ ముక్క రాసియ్యండి బాబూ"

"చీటీ. చీటీకదూ. మరే చీటీ....అవును చీటీ....కాని కాని వీల్లేదే మా యింట్లో....నా కర్జెంటు పనుంది. నువ్వెళ్ళి చెప్పు. కావాలంటే ఆయన్నే పట్టమ్మను" అన్నాడు శంకరంగారు కంగారుగా. లోపలికి తొంగిచూశారు. భార్య దగ్గర్లో లేదు.

పుణ్యం ఉంటుందనీ, జన్మలో మేలు మర్చిపోడనీ, డబ్బు మర్నాడే ఫిరాయించేస్తాడనీ, సంగతి తాపీగా చెప్తాడనీ, పుణ్యం ఉంటుందనీ, జన్మలో మేలు మర్చిపోలేడనీ పదేపదే మరీమరీ సుబ్బారావుకు చెప్పి ఎలాగేనా రొఖం జతపరిచి పట్టావలసిందని నాగన్నకి చెప్పి పంపాడు.

నాగన్న వెళ్ళిన క్షణంనుండి నాలుగూ నలభై ఐదు వరకూ ఆయన గుండె నిమిషానికి నాలుగువందలసార్లు చొప్పున కొట్టుకుంది.

ఇంట్లో పిండివంటలు పూర్తి అయిపోయాయి. మూట కట్టేసి, కొడుకూ కోడలూ ప్రయాణానికి సిద్ధమైపోయారు. భార్య పట్టుచీర

కట్టేసుకుంది. కొడుకు బండి తీసుకురావడానికెళ్ళాడు. ఇంకో పదినిమిషాలలో అంతా రైలుకి బయల్దేరుతారు.

నాగన్న సుబ్బారావు ఇంటికి వెళ్ళాడా? వెళ్తే ఆయన ఉంటాడా? ఉంటే డబ్బిస్తాడా? ఇచ్చినా, అది తనకి వేళకి అందుతుందా? అందినా భార్య కంటపడకుండా ఉంటుందా? కొడుకుకి కష్టం ఆదుకుని శంకరంగారు ఆదర్శపితగా నిరూపించుకుంటాడా?

గుమ్మంలోకి బండి వచ్చేసింది. సామాను పెట్టేస్తున్నారు, టైము చూసుకుని, శంకరంగారి భార్య ఆయన పంచె చొక్కా కండువా ఇచ్చేసి కట్టుకోమంది. శంకరంగారు కదల్లేదు. తను లోపలికివెళ్తే ఈలోగా కొంప మునుగుతుందని భయం. భార్య గదమాయిస్తోంది.

"మెడ బెణికింది. అర్జెంటుగా కాసిని నీళ్ళు కాచు. కాపడం పెట్టాలి" అన్నాడాయన హఠాత్తుగా బాధపడుతూ.

ఆవిడకి జాలేసింది. "పొద్దుట్నుంచి ఒక్కరూ ఆ పడక కుర్చీలోనే కూర్చున్నారాయె, బెణకదూ మరి." అంటూ లోపలికి వెళ్ళి కుంపటి రాజేసింది.

ఈలోగా నాగన్న సుబ్బారావింటికి వెళ్ళాడు. సందేశం అందజేశాడు కాషియర్‌గారికి అప్పిచ్చినా పువ్వుల్లోపెట్టి మళ్ళీ ఇవ్వగలరన్న ధీమాతో సుబ్బారావుగారు ఏభై రూపాయలూ నాగన్నకిచ్చి పంపాడు. నాగన్న వాయువేగ మనోవేగాలతో వచ్చి, శంకరంగారికి రొఖం అందించాడు. "నా కిత్తానన్న రూపాయేదిబాబూ?" అన్నాడు.

"రేపు రేపు రేపు. లేదు లేదు చిల్లర లేదు. రేపు రెండు. రేపు రెండిస్తా - పద పద పద" అంటూ శంకరంగారు ఆదరా బాదరా ఆ డబ్బూ పంచె, చొక్కా పట్టుకుని పడమటింట్లో కెళ్ళిపోయి తలుపేసుకున్నాడు.

*　　*　　*　　*

రైలొచ్చింది. నలుగురూ ఎక్కి కూర్చున్నారు - అక్కడకూడా శంకరం గారికి స్వేచ్ఛ లేకపోయింది - భార్య ఒక పక్క కోడలికి నీతులు నూరిపోస్తూనే తనని ఓ కంట కనిపెడుతోంది.

"అత్తయ్యా! మా అమ్మలేని కొరత తీర్చారు మీరు ఈ ఒక్క రోజులోనూ. మా పిన్ని ఇంత ఆప్యాయంగా నన్నెన్నడూ చూడ లేదత్తయ్యా. మీరు మా వూరు రావాలి. నెల్లాళ్ళపాటు ఉండాలి" అంది కోడలు హఠాత్తుగా.

శంకరంగారి భార్య ఉక్కిరి బిక్కిరై పోయింది కోడలి శీర్షాన్ని ఆఘ్రాణించింది. మెటికలు విరుచుకు "నా తల్లే" అంది ఉప్పొంగే ప్రేమతో. ఒక్క క్షణం ఆగి "ఏమండీ! కోడలుకి పువ్వులు కొనిద్దామనే నా లేదుగదా. వేళైనట్లుంది. చటుక్కునవెళ్ళి కాస్త దవనం మరువం నాలుగు చేమంతి పువ్వులూ పట్రండి." అంటూ ఓ పావలా తీసి ఇచ్చింది.

శంకరంగారు ఎగిరి గంతేశాడు.

"నువ్వుకూడా వెళ్ళరా-ఆయన బేరంచేస్తే వాడిన పువ్వులే వచ్చేది" అందావిడ.

"దారా నాన్నా" అన్నాడు శంకరం విడుదల అయిన ఖైదీలా.

పువ్వులు కొన్నాక, అంగీజేబులోనుంచి ఏభై రూపాయలూ తీసి కొడుకు జేబులో పెట్టాడు. "భద్రం నాయనా, కోడలికి చెప్పకు. అవస రానికుంచుకో, ఇంతకన్న ఏం చేయలేకపోయాను. తాపీగా పంపుతానులే" అనేసి కొడుకు జవాబు వినకుండానే రెక్కపట్టుకొని రైలుపెట్టె దగ్గరికి ఈడ్చుకొచ్చేశాడు.

రైలు కదిలింది.

రతీ మన్మథులు చెన్నపట్నానికి, పార్వతీ పరమేశ్వరులు స్వగృహానికి బయల్దేరారు.

ఒంపెద్దుబండిలో జేరగిలబడి కూర్చుని "అబ్బాయి మొహం అణా యిద్దేనంతయింది. బయల్దేరినపుడు వెనకనించి డబ్బు పంపుతా-నన్నారు కాబోలు. అవేం వల్లకాదు" అందావిడ హేళనగా.

శంకరంగారు ధీమాగా నవ్వాడు. "కోడలు పిల్ల మొహం కల కల లాడుతూ, కనబడింది. ఏమిటి సంగతి? తెగించి ఓ పావలా చేతులో పెట్టి గుప్పిటమూసి, జంతికలు కొనుక్కోమన్నావా?" అన్నాడు.

"పిల్లలు అవస్థ పడతారని నాకూ తెలుసు. అక్కడికి మీకే ప్రేమ ఉన్నట్లు నిన్నా ఇవాళా నా ప్రాణం తీశారు కాని, పావలా ఏం కర్మం, నిన్న మీరడిగిన యాభై రూపాయలూ, మిమ్మల్ని పువ్వులికి పంపినపుడు పిల్లచేతిలో పెట్టి గుట్టుగా దాచుకోమని చెప్పాను. అబ్బాయికి ఈ సంగతి రాయబోకండి. రేపే తగలేస్తాడు" అందావిడ విలాసంగా.

"అబ్బే. నేను రాసినా వాడలా అడగడులే." అన్నాడు శంకరం గారు గుంభనగా.

# ప్రయోజకుడు

"శ్రీరస్తు శుభమస్తు కళ్యాణమస్తు: సర్వ సద్గుణసహిత సౌభాగ్యమస్తు" అంటూ, ఉప్పొంగే ఆ ప్రేమని ఆశీర్వచన రూపేణా ఉచ్చారణ చేశారు సుబ్రహ్మణ్యంగారు పద్మావతి నమస్కారం స్వీకరిస్తూ.

"రాజంటి మొగుణ్ణి పెళ్ళాడి పండంటి పిల్లల్ని కని వర్ధిల్లు తల్లీ!" అన్నది కామేశ్వరమ్మగారు.

"పార్వతీ పరమేశ్వరులవంటి వృద్ధ దంపతులు-మీ నోటిమాట చలవని ఏదో...." అంటూ ఊహల్లో మురిసిపోయింది సూర్యకాంతమ్మ గారు అవిడ తమ్ముడు రాజువేపు చూస్తూ.

తాళ ప్రమాణాన లేచారు సుబ్రహ్మణ్యంగారు-- "చూశావే పిల్లా! నీతోపాటు నన్నూ ముసలాణ్ణిచేసి పారేసింది వదినగారు.... కిమ్మన వేం?....చెప్పు!" అంటూ భార్య కామేశ్వరమ్మగార్ని మోచేత్తో పొడిచారు.

కామేశ్వరమ్మగారు విసుక్కుంది, "బావుంది సరసం——మరీరోజు రోజుకి కుర్రచేష్టలు ఎక్కువయిపోతున్నాయి. ఇదెక్కడి అల్లరమ్మా! చిన్నాపెద్దా, సమయం సందర్భం లేకండా! ఏదో శాస్త్రం చెప్పినట్టుంది ....పెళ్ళీడు పిల్లముందర ఏమిటా మాటలు? మరీ ఇది కాపోతే...."

చిలిపిగా వెలిగాయి సుబ్రహ్మణ్యంగారి కళ్ళు. "చూశారూ వదినా ....మా కాముడుందే --స్వతహాగా చాలా మంచిదేనుమండీ—ఏదో అప్పుడప్పుడు కొంచెం తిక్క—అస్తమానూ నన్ను ఇలా రాసి రంపాన పెడుతుం దనుకునేరు! అన్నారు, సూర్యకాంతమ్మగారితో. ముసిముసి నవ్వులతో అటు తిరిగి తన భర్తవేపు చూసింది సూర్యకాంతమ్మగారు. ఈ గొడవలతో సంబంధం లేనివాడల్లే ఆయన సావకాశంగా చుట్ట కాల్చు కుంటూ, గబగబా పేపరు చదువుకుంటున్నాడు.

మళ్ళా ఇటు తిరిగింది.

"ఏదో బాబూ! మీ నోటి చలవన మా పద్మకి మా రాజిగాడు మూడు మూళ్ళూ పడేస్తే....ఏవఁనుకున్నారో గానీ వాడికి పద్మంటే పంచప్రాణాలూను. ఇది చూస్తే సవాలక్షగంధం చదువుతుంది వాడిమీద" అంది—దూరంగా బంగారుతండ్రల్లే బాచాల కొండల్లే కూర్చున్న రాజును చూస్తూ.

సుబ్రహ్మణ్యంగారి సతీమణి కామేశ్వరమ్మగారు అందుకుంది. "ఆఁ! మీకు పిచ్చికాని, దాని కిష్టమే ఉంటుంది.—బావనికాదని ఇంకె వడ్ని చేసుకుంటుందండీ — కాపోతే సిగ్గు — పిచ్చితల్లికి"

"ఆఁ!చాల్లెద్దూ! కబుర్ల కెక్కడికిలే—ఈ కాలం పిల్లలు మీ కన్నా నాలుగాకులు ఎక్కువ చదివారు. "ఫలానా మొగుడే" కావాలని ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పగలరు తెలుసా! సిగ్గూ బొగ్గూ కుదరదు. నిన్ను నా కిచ్చి కట్టినట్టనుకున్నావా ఏం?" అంటూ పద్మవంక చూశారు సుబ్రమణ్యంగారు.

సరిగ్గా అదే సమయానికి పేపరు చదువుతున్న పెద్దమనిషి- పద్మ తండ్రి - మందహాసం చేశారు. తిరిగి చుట్ట నోట్లో పెట్టుకుని పేపరు తినటం మొదలెట్టాడు.

"పద్మ ప్రేమేగిపోయింది" అనేవాళ్ళు:- ఆ క్షణాన పద్మ అన్న మాట ఎవరేనా పరాయివాళ్ళు వినివుంటే. నిజమే! పద్మ అన్నదిది-

"రాజుగాణ్ణీ, గీజుగాణ్ణీ నేను చచ్చినా పెళ్ళాడను. నేను అప్పారావుని పెళ్ళాడుతా. నాన్నగారు కూడా సరే అన్నారు" అని.

"అవ్వ హవ్వ!" అన్నది సూర్యకాంతమ్మగారు.

తుళ్ళిపడ్డాడు పద్మ తండ్రి.

కామేశ్వరమ్మగారు విస్తుపోయింది.

సుబ్రహ్మణ్యంగారు హాహాకారాలతో నవ్వటం ప్రారంభించారు.

ఆయన అంత హృదయపూర్వకంగా నవ్వి చాలా కాలం అయింది. ఆ నవ్వుకి పచ్చగా దోసకాయవలె, వెండిమీసాలతో నిండుగా వున్న ఆయన ముఖం ఎఱ్ఱగా అయిపోయింది. ఫాల భాగాన కణతలమీద రక్తనాళాలు ప్రస్ఫుటంగా కనబడ్డాయి. కంటనీరు తిరిగింది.

కామేశ్వరమ్మగారు కంగారు పడిపోయింది. బెంబేలెత్తిపోయింది. "ఏం ఓఘూయిత్యపు మనిషమ్మా!- ఏమొచ్చినా చిక్కే" అంటూ సుబ్రహ్మణ్యంగారికి గాలి విసరటం ప్రారంభించింది.

నవ్వునించి సుబ్రహ్మణ్యంగారు త్వరగానే తేరుకున్నారు. అందరి మనస్సులూ తేలికపడ్డాయి.

"కంగారు పడ్డావుటే కాముడూ!" అన్నారు సుబ్రహ్మణ్యంగారు, "చూడండి వదినా——మా కాముడికి నేనంటే యెంత ప్రాణమో! సీతా సావిత్రీ - సువర్చలా - సుబ్బారావుగారి ఎంకీ, మా కాముడు ముందు తీసికట్టే-"

ఈ కొత్త ధోరణి ఎన్నడూ కనీ వినీ ఎరుగని కాంతమ్మగారు కొద్ది కంగారుపడింది.

పండు తమలపాకువంటి కామేశ్వరమ్మగారి శరీరం ఆపాద మస్తకం జలదరించింది. సంధ్యా సమయాన, ఎర్రని కాంతులతో వెలిగే ఆకాశఫలకాన సూర్యబింబంవలె, సిగ్గుతో కందిపోయి ఎర్రబారిన ఆమె విశాలమైన నుదురుపైన వెండి రూపాయంతటి కుంకుమ తిలకం ప్రకాశించింది. పండబారిన ఆమె శిరోజాలు ఆ అరుణరాగంలో పాలి పోయాయి. పాతిక సంవత్సరాల క్రితం తొలిసారి సిగ్గుతో వాలిన ఆమె సుందర, సువిశాల నేత్రాలు, ఆనాడు ఆమెలో తను చూచిన దేవతల అందం తిరిగి, ఈ క్షణాన, ఒకే ఒక ముహూర్తకాలంపాటు సుబ్రహ్మణ్యంగారికి గోచరించాయి.

క్షణకాలం ముగ్ధుడై పోయాడాయన- తనభార్య సౌందర్యం చూసి.

"చాల్లెండి - ఎవరన్నా నవ్వి పోయేరు" అన్నది కామేశ్వరమ్మ గారు - చెంపకు చారెడున్న కళ్ళని సొగసుగా వాల్చుకుంటూ.

పక పక నవ్వారు సుబ్రహ్మణ్యంగారు - నోరు తెరుచుకుని ఆశ్చర్యంగా తనవంక చూస్తున్న పద్మవంక చూస్తూ.

"ఏం పద్మ తల్లీ - రేపు నీ మొగుణ్ణి ఇలాగే గసిరిపారేస్తావే నువ్వానూ?"

పెంకె ఘటం పద్మ.

"లేదు తాతా.... మంచి మొగుడు దొరుకుతే గసరనులే. రాజుబావ లాటివాడు దాపరించాడా - గసరడం కాదు గదా, తంతానుకూడా" అంది.

"సిసలయిన ఆడదానివే నువ్వు ....నీ మాట నెగ్గించుకోవాలి గాని...."అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

పద్మతల్లి కొంచెం చిరాకు పడింది ఈ ధోరణి చూసి. ఇక లాభం లేదు. "ఏమే పిల్లా! ఓ నీళ్ళు పోసుకేదుద్దాం-ఓ జడ ఏదుద్దాం....లేకపోతే

కాఫీ చెంబులు తొల్చి లోపల పడేద్దాం అనీ లేదుగదా .... ఊహూ పెద్దా పేరక్కలాగ తయారూ! తగుదునమ్మా అంటూ- చిన్నా పెద్దా లేకుండా- ఊఁ: కదలవేం?"

పద్మ కదిలే సూచనలేం కనపడలేదు. వాళ్ళ నాన్న కేవలం ధూమా నంద స్వామివలె చుట్ట కాలుస్తూ, తనలో తనే నవ్వుకుంటున్నాడు.

సుబ్రహ్మణ్యంగారు చిన్న చిన్న కలహాలు పుట్టించడంలో అందె వేసిన చెయ్యి. సమయం చూసి చిటిక్క వేశారు చమత్కారంగా. "ఏవ మ్మోయ్ వదినా! కుర్రకుంక- దాన్నంటావేం! అదుగో వెనుక నుంచి భాగవతం ఆడించేది మీ ఆయన. అతగాణ్ణి అడుగు నిలేసి .... ఏమయ్యా ధూమానంద స్వామీ!....ఏం కథ?...."

"అలా గట్టిగా అడగండి బాబూ....అలా అడగండి...."

ధూమానందస్వామి చిరునవ్వు ప్రచురించాడు.

ఛర్రునలేచి వంటింట్లోకి పోయింది సూర్యకాంతమ్మగారు బాష్ప వేదం పఠిస్తూ.

పద్మ కిల కిల నవ్వింది.

సుబ్రహ్మణ్యంగారికి గుర్తుకొచ్చింది.

"బానే కాముడూ....మన సుబ్బులు పోలిక లేదే పద్మకి? ....లేక పోవడమేమిటి! అంతా అదేనాయె! కనుముక్కు తీరూ కట్టూబొట్టూ మాట తీరూ—ఎటొచ్చీ పేరు తేడా అంతే....!"

కథకి ఉపక్రమించే సూచనలు కనబడ్డాయి సుబ్రహ్మణ్యంగారిలో కామేశ్వరమ్మగారికి.

"పనీపాటూ లేదా ఏమిటి మీకు—రైలు దిగి కథ మొదలెట్టా రపుడే కబుర్లు. కట్టి పెట్టి స్నానానికి లేవండి." కొంటెగా భార్య వేపు చూసి

కన్ను మీటి ఏం జరగనట్టే రామదాసు వైపు తిరిగారు. "ఏమోయ్! ఓ రామదాసు పంతులూ !ఓ! ధూమానంద స్వాములూ! ఇంకో చుట్ట పట్టుకు నిక్కడకు రావయ్యా—కథ చెప్తానూ. మాసుబ్బలక్ష్మి అచ్చం నీకూతురులాగే వుంటుంది. చిత్రంగా అయిందిలే దాని పెళ్ళి."

రామదాసుగారు దగ్గిరకు జరిగారు ఉషారుగా. పద్మ బాషెంపెట్టి వేసుక్కూర్చుంది శ్రద్ధగా.



'నేను లోపల కెడతా—మీరు కథలు చెబుతారో కచేరీలు చేస్తారో కానీయండి బాబూ"అని సాగదీసుకుంటూ లోపలకి సాగిపోయింది కామేశ్వరమ్మ గారు.



మంచినీళ్ళబిందె భుజాన పెట్టుకుని లోపలకొస్తున్న రామదాసుగారి తల్లి, కథ అన్నమాట వినబడగానే నిలబడిపోయింది.

'ఎప్పుడు రాక బాబూ! అంతా కులాసేనా? ఉత్తరం రాశారుగాదు.... అవునుగానీ పట్టపగలు కథ చెప్పుకుంటే పట్టపు రాజు చచ్చిపోతాడు. ఒక్క క్షణం ఉండు బాబూ" అంటూనే బిందె దింపి పట్టపు రాజుని భద్రంగా కొంగులో ముడేసుకుని బిందె పట్టుకు చక్కా పోయిందావిడ. "ఓ సూరీడూ ఏం చేస్తున్నావే"అంటూ.

ముసి ముసి నవ్వుల్తో చుట్ట అంటించి పడక్కుర్చీలో సాగిల పడ్డారు సుబ్రహ్మణ్యంగారు. ఇటు రామదాసుగారూ, అటు పద్మా కూచ్చున్నారు శ్రోతలుగా.

"అస లతగాడు రావడమే ఒక పెద్ద గాలీ వాన తంతుగా వచ్చాడు వూళ్ళోకి" అంటూ కథ మొదలుపెట్టారు అర్ధ నిమీలిత నేత్రులై పొగను చూస్తూ.

"వా డెవడూ? ఎక్కడకొచ్చాడూ? ఎందుకొచ్చాడూ? సరిగ్గా చెప్ప వయ్యా" అన్నారు రామదాసుగారు.

"అదే. ఏముందీ, నీ కూతురి పెళ్ళిసంగతి కదయ్యా మనం ఇప్పుడు గొడవ పడుతున్నదీ; నీ పెళ్ళాం-రాజు కిస్తానంటుందీ. నీ కూతురు పెుయిలరు అప్పారావంటుంది. నువ్వు మౌనేన కలహం నాస్తి అంటావు-ప్రయోజకుడని నువ్వనుకున్నవాడు దొరికేవరకూ.ఇంతకీ అంత ప్రయోజకుడైన వాడొస్తే నువిచ్చేదేవిటయ్యా? వాడే ఎగరేసుకు పోతాడు. నీ కూతురు వెంటపడుతుంది. అంచేత నేననే దేమిటంటే ఆ రాజూ కాదు ఈ అప్పారావూకాదు. బ్రహ్మ నిర్దేసించిన ఇంకో శోభనాద్రి ఊడిపడతాడు; దేగలా ఎగరేసుకు పోతాడు నీ కూతుర్ని".

"ఆ శోభనాద్రి బావుంటాడా?" అంది పద్మ.

"దేవుడు కలగచేసుకుంటే నీ ఆట లేమి సాగవులే" అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

"ఆవచ్చినవాడు బావుండకపోతే తన్ని తగలేస్తా వాణ్ణి" అంది పద్మ.

"అదుగో, అదుగో! సరిగ్గా సుబ్బలక్ష్మి అంతే. సుబ్బలక్ష్మి తెలీదయ్యా; జగన్నాథం కూతురూ? ఇలాగే వాగేది కుండ పగలకొట్టినట్టు చితకలాటి మొగుడు దొరికాడు దానికి. బతక నేర్చినవాడులే! బహులౌక్యుడు .... అదే. ఆ కుర్రాడున్నాడే, వాడు రావడం రావడం గాలివాన తంతుగా వచ్చాడూళ్ళోకి. నేను పొలం పన్లమీద అప్పటికి వారం రోజుల క్రితమే ఆ వూరెళ్ళాను. రెండు నెల్లు బివాజా వేగానుతే.

మరి కథ విను చెప్తా....

(సుబ్రహ్మణ్యేన ఉవాచః ఇదికథా ప్రారంభః)

"ఆ ఊళ్ళో - ప్రతి తెలుగు వూళ్ళోలాగే — మేడమీద తల ఉన్న ప్రతి ఆసామికీ, వాడికి ఉండుకునే ఆయొక్క భార్యకీ,కొడుక్కీ,

కూతురికీ, ప్రతి రెండో మనిషి జీవిత చరిత్రా కంఠతా పట్టి వల్లె వేస్తుంటే నేగానీ తోచదు. అందరూ కవులే! పోతన్న గారిని తల దన్నిన ఆసాములే కవిత్వంలో. తెలిసిన కబురికి నగిషీలు చెక్కి రంగులు వేసి మరీ ఇస్తారు పక్కవాడికి. నేను రెండు నెలలు పూర్తిగా బిచాణా వేశా నక్కడ.... అదే—నేను దిగిన వారంరోజుల్లో కామోసూ—రంగధాము డొకడు ఊళ్ళో దిగాడని వదంతులు లేచాయి.

"అతిథి మర్యాదలు చేసేనిమిత్తం బయలుదేరాం ఒకతండా. బెహరా హోటేలు పక్కన ఇంట్లో దిగాడన్నారు వార్తాహరులు. పోయి చూదుంకదా, కృష్ణమూర్తిగారి కొడుకు సుందర్రావు. పదేళ్ళ క్రిందటే కృష్ణమూర్తి పోయాడు. అతగాడు ఆస్తికన్న అప్పులు మిగిల్చి వెళ్ళాడు. అప్పటికి పన్నెండేళ్ళుంటాయి సుందర్రావుకి. పట్నంపోయాడు మేన మామతో....

"నోరు మంచిదైతే వూరు మంచిదన్నారు- వాళ్ళనీ వీళ్ళనీ మంచి చేసుకుని చదువూ సంధ్యా నేర్చుకుని నాలుగురాళ్ళు తేవడం మొదలు పెట్టాడు పద్దెనిమిదో ఏటికే."

"ప్రయోజకుడైనాడందూ....స్వయం శక్తితో" అన్నారు రామ దాసు పంతులుగారు శ్రద్ధగా.

"నాలుగు రాళ్ళంటే ఎన్ని రూపాయలు తాతా....మరి ఇంటికి చాలేవీ?" అంది పద్మ కళ్ళు పెద్దవిచేసి.

సుబ్రహ్మణ్యంగారు సాగిపోయారు.

"ఇల్లేముందీ ఒంటిపక్షి అయిపోయాడుగా.... ఇదుగో ఎంత ప్రయోజకుడైనాడయ్యా అంటే, రెండేళ్ళ కిందట తిరిగి స్వగ్రామం వచ్చి అప్పులాళ్ళెగరేసుకుపోయిన భూములు తిరిగి కొన్నాడయ్యా.... ఆఁ! ప్రయోజకత్వం అంటే అదీ !....సరే.... మేమంతా వెళ్ళాంగా—

పలకరించాం—మళ్ళా ఆ భూముల్ని కౌలుకిచ్చి ఓ నెల ఇక్కడ కాలక్షేపం చేసి పోదామని ఒచ్చాట్ట-పట్నం విసుగేసి. "ఆవకాయ,మాగాయ, మామిడిపండు తినాలని మనసు పోయిందండీ. పోతే—నా అన్నవాళ్ళు మీ వంటివారి మధ్య నాలుగు రోజులు గడిపి పోవాలనుంది అవ(టా అన్నాడు. కుర్రాడు చూస్తే దీపంలా వున్నాడు, ఆ యొక్క వినయం, ఆ వందనం, ఆ మాట ఒద్దిక— ఓహో! ఎన్నికైన కుర్రాడయ్యా"

"ఏం చదివాడేం" అన్నాడు రామదాసుగారు.

"ఎలా వుంటాడేం" అంది పద్మ.

"చామనచాయ. కాస్త పొడుగనే చెప్పాలి. బక్క పలచగా వుంటాడు. అందాలరాసి అననుగానీ మొగతనంలో వుండే ఆకర్షణ వుంది ఆ కుర్రాడిలో....కళ్ళున్నాయే కళ్ళు, కళ్ళజోడు వెనుక నుంచి చూస్తే ఆ కళ్ళలో ఆర్ద్రత గోచరిస్తుంది. కొద్దిగా, విశాలమైన నుదుటు. నూగు మీసం. సరే పట్టవాసపు క్రాపు జుత్తు, కళ్ళజోడూ, రిస్టువాచీ, కమామీషూ ఉన్నాయనుకో.........ఆడదాని కేడువారాల నగలన్నారు....ఇతగాడు ఏడు వారాలకీ ఏడుజెళ్ళ పధ్నాలుగు జతలచొప్పున మారుస్తాడు. ఓ! పరిమళాలు గుబాళించిపోతాయి. జోళ్ళే ఓచిన్న దుకాణం ఏర్పాటు ఉన్నాయి. భ్రష్టా జనుకునేవు సుమా నన్ను !.... రామదాసూ— ఒక్కటి చెపుతా విను.... నీవంటి సంసారి ఆ సమయంలో అతగాడిని చూశాడా-దుబారా దివాణంలా వుందా వ్యవహారం....అనేవాడు."

"పోన్లే ఇప్పుడు వింటున్నానుగా. ఇప్పుడంటా—శుద్ధ దుబారా వ్యవహారమే...."అన్నారు రామదాసుగారు చుట్ట ఆర్పేస్తూ.

"నువ్వు అనే దేమిటోయ్! అనాల్సిన వాళ్ళంతా అదివరకే అనేశారు. ఆ కుర్రాణ్ణి స్నానానికి వదిలేసి మేం బయటికొచ్చేసరికి గొల్లుమన్నారు—మా తండావాళ్ళు ఏకగ్రీవంగా."

"జోరుగా వుండే వ్యవహారం కుర్రాడిది" అన్నాడు అవధాన్లు కళ్ళుమీటుతూ.

"జోరా జోరున్నరా! కాకపోయినా అదేమిటోయ్ మరీ ఇదిగా పోతే — ఆ ప్రింకు చూశావూ — ఓ పాతిక జతలుండవూ గుడ్డలూ?" అన్నాడు జోగినాథం.

"జోళ్ళోయ్! జోళ్ళు! జోళ్ళమాట మర్చిపోయావు! రామరామ! అవొక బూటా — అదొక కాభోలీ జోడా-అదొక స్లిపర్సా — అదొక స్లిప్పరా — "అంటూ దండకం ప్రారంభించాడు — జోళ్ళ వివరాలు తెలుసుకున్న కోదండరావు.

"అవన్నీ సరేకాని—నాకు చిత్రంత్తం ..దెక్కడయ్యా అంటే--వంట వాణ్ణి తెచ్చాడయ్యా, వంటవాణ్ణి! ఇదేమైనా సంసారి లక్షణమేనా అని?.... వాళ్ళ నాన్న బతికున్నప్పుడు ఎంత పొదుపూ! ఎంత పొదుపూ!....గుట్టుగా వెళ్ళబుచ్చాడు కాలం." అన్నారు జగన్నాథంగారు;

"రామదాసూ! ఇదీ ధోరణి! నాకు జాలేసింది సుమా. రాకరాక కుర్ర వాడు సొంత ఇంటికొస్తే....పరోక్షాన్నే అనుకో....ఇలా దుయ్యబట్టం నచ్చలేదు నాకు.

"ఏమయ్యా వాడికి వంటరాబోతే నువ్వు వండి పెడతావా?" అన్నాను నేను.

"మహారాజులా! సోలెడు బియ్యం పడేసే నాథుడే లేడా ఇక్కడ!" అన్నాడు జోగినాథం.

అవధాని తగుల్కున్నాడు. "చాల్లేవయ్యా—దక్షతకి నిన్నే చెప్పు కోవాలి ముందర. కబుర్లకేం తియ్యగా చెప్పొచ్చావ్—!"అంటూ.

జోగినాథం మండిపడ్డాడు. "పోవయ్యా! నువ్వోనాడు సవ్యంగా మాట్లాదేవూ" "పోన్లే:...నేను మాటేనా అన్నాను.... నువ్వదీ లేదుగా.

ఇంతకీ ఎవ దేడ్చినా కుఱ్ఱవాడు, డబ్బు దుబారా చేసుకుంటే చిప్ప చేతి కొస్తుందనీ, వీడు మన కిష్టమూర్తి కుఱ్ఱాడనే నా ఇది."

"అందరి ఇదీ అంతేనయ్యా! ముందు ముందు పెళ్ళి గట్రా చేసుకుంటే, కొంపాగోడూ కట్టుకేడిస్తే ఈ ఎత్తున తూగగలడా అని" అన్నాడు జగన్నాథంగారు.

"ఏవఁయ్యోయ్! జగన్నాథం! పిల్లనిగానీ ఇవ్వాలనుకుంటున్నావేమిటి ఈ కుఱ్ఱాడికి?—ఎఱ్ఱగా బుఱ్ఱగా ఉన్నాడని మురిసి బోర్లాపడేవు" అన్నాడు జోగినాథం.

"అబ్బో? జగన్నాథం కూతురు—సుబ్బులయ్యా అది! అది మొగుణ్ణమ్మేస్తుంది తెలుసా!" అన్నా డవధాన్లు.

కామేశ్వరమ్మగారు లోపల్నుంచి ధనియాల కాఫీ తెచ్చింది. సుబ్రహ్మణ్యంగారు కథ ఆపారు.

"సుబ్బులు పెళ్ళిసంగతా?" అందావిడ.

"చిత్తం.... ఏం శలవండి...."అన్నారు సుబ్రహ్మణ్యంగారు.

"బావుంది! నోరెత్తడం భయంగా ఉంది బాబూ ఈ మనిషి దగ్గర. ఆ కాఫీ తాగి గ్లాసిలా పారేయండి. తొరగా తెమిల్తే నీళ్ళు తోలుపుతాను" అన్నదావిడ.

గ్లాసిచ్చి కథ సాగించారు సుబ్రహ్మణ్యంగారు;

"వింటున్నావే పద్మా!........ఆ సుబ్బులుందే—అది నీలాటిదే". శుద్ధమొండి ఘటం. లాకాయి లూకాయిమనిషి దానికి పనికిరాడు.... ఉభయ గోదావరి జిల్లాలలోని మన్మధు లందరిలో ఒక్కడు కూడా నచ్చలేదు తెలుసా దానికి? ప్రతివాడికీ ఒంకపెట్టేది— అంత ఆడది అది....సరే

నయ్యా రామదాసూ! ఏవిటి చెప్తున్నానూ——ఆ——అదే మా గుంపు నలుగురూ ఆ సుందర్రావుని పట్టుకు ఏకిపారేశారు. సరే మెల్లిగా అందరం బెహరా హోటలుకి చేరాం....బెహరా హోటలు ఇద్దెన్లకి ప్రసిద్ధి. పెసరట్టుకు పెట్టిందిపేరు——కాఫీ నాటు రకం అనుకో. వరండాలోకి చేరాం అయిదుగురం——ఒక్కడికీ పనీ పాటూ లేదాయె తిని తిరగటం మినహా. ఉద్యోగం పురుషలక్షణం అన్నారు, గాబట్టి చదరంగం ఆడతారు వాళ్ళు. నాకు రాదనుకో. చూడ్డం బాగావచ్చు. సరే ఇద్దరు చదరంగానికి కూరుచున్నారు. మిగతా ఇద్దరూ సుందరావు ఆస్తి, ఆదాయవ్యయాల అంచనాలు వెయ్యటం ప్రారంభించారు. నేను ఇద్దెనుల ఆరగింపు మొదలెట్టాను. ఐదో ఇద్దెను మొదలెట్టబోతున్నాను. అయ్యరు ఊళ్ళో గోల ఏకరువు పెడుతున్నాడు.

తెల్లని సిలుకు చొక్కా వేసుకొని, గ్లాస్కోపంచ గూడకట్టు కట్టుకుని, చక్కగా తల దువ్వుకుని, సిగరెట్టుపెట్టి, అగ్గిపెట్టి పట్టుకుని వచ్చాడు సుందర్రావు. స్నానం గీనం చేశాడేమో-నవనవలాడిపోతున్నాడు జేగురుపాడు వంకాయలాగా. హోటలుకి పాలేరు కుర్రాడు దారిచూపించాడు కాబోలు; వాడికి వో అణాకాసు ఇచ్చాడయ్యా. అంతే ఇటు తిరిగి చిరునవ్వుతో పాకలోకి రాబోయినవాడల్లా——కొయ్యబారిపోయాడు. కారణం ఏమిటని అడగవేం?....వినూ....బురదరోడ్డుమీద పరుగెత్తే పాత లారీకి సడన్ బ్రేకు వేసినప్పుడు సంభవించే శబ్దంతో సరితూగ్గలిగినంత గట్టిగా కేరుతూ ఆశ్చర్యం ప్రకటించారు....అవధానులూ, జోగినాధమూ జమిలిగా. ఆ యొక్క శబ్దం విని జగన్నాధం, ఆయొక్క దృశ్యం చూసి సుందర్రావూ-అతన్ని చూసి నేనూ వరుసక్రమంలో ఆశ్చర్యపోయాం. అరనిమిషం తరవాత జోగినాధం బొయ్యిమన్నాడు! "ఆ పాలేరు వెధవకి నువ్వు అణా ఎందుకిచ్చినట్టయ్యా పంతులూ...." అన్నాడు కనిష్టేపు గొంతుకతో. సుందరం గ్రహించాడు కథ. నవ్వాడు.

"ఆఁ, పనిమల్లే నా కూడా వచ్చి దారిచూపించాడని. ఏం తప్పా?" అన్నాడు అమాయకంగా. పాక అదిరేటట్టు నవ్వారు అందరూ. జోగినాథం జోరు హెచ్చింది.

"పాలేరాళ్ళందరికీ ఇలా అణాలు పారేస్తూ - "తప్పా" అని అడుగుతావూ? - తప్పూ ఒప్పూ ఎవడిగ్గావాలయ్యా! రేపు చేతికొచ్చేది-"

"చప్ నోరు ముయ్యి" అంటూ జగన్నాథంగారు చేతిలో ఉన్న శగటుని జోగినాథం నోట్లో పెట్టేశారు.... సుందరం మనస్సు చివుక్కుమంచి అనుకున్నాను, చిన్నబోయిన అతని మొహం చూసి.

"రావోయ్! రా! ఇదంతా మామూలే....పరవాలేదు రా" అన్నాను. నేను మహా పాతకాపయినట్టు. జోళ్ళు గుమ్మంలోపదిలి లోపలికి వచ్చి కూర్చున్నాడు సుందరం. మా వాళ్ళకి రెండు కళ్ళు చాలటంలేదు అతన్ని చూడ్డానికి. అంచేత వాళ్ళది వీళ్ళూ, వీళ్ళది వాళ్ళూ ఎరువుచ్చుకుని మరీ చూసేస్తున్నారు చొంగలు కారుస్తూ.

అయ్యరు ఇడ్లీ తెచ్చి పెట్టాడు సుందరం ముందు. "వారికి కూడా తెండి" అన్నాడు సుందరం: ఇడ్లీలు ముట్టుకోకుండా—మా చతుష్టయంలో చలనం కలిగింది. చిరునవ్వులు కూడా ఒలికాయి.

"అవ్వే ఎందుకు సుందరం బాబూ! డబ్బు దండుగా" అన్నాడు జోగినాథం.

"వృధా వ్యయం కాదండోయ్!"

"మేం పుచ్చుకున్నాం"

"అదీకాక మేం ఎలాగా భోంచేస్తాంగా"

"మేం భోంచేస్తామండి - ఎలాగా" అన్నాడు సుందరం మహా వినయంగా. ఆ తరువాత అందరూ కలిసి బ్రహ్మాండంగా నవ్వేరు....నవ్వు

పూర్తి అయేసరికి అయ్యరు ఇడ్లీలు వడ్డించడం, అందరూ ప్రోత్సహించి మొదటముక్క నమలడం జరిగిపోయింది..

"పెసరట్టు కాల్చనా బాబూ!" అన్నాడు అయ్యరు వేషం తగిలిన ఉషారుతో.

"నాకు ఉల్లిపాయ వద్దు. కాని అల్లం, పచ్చిమిరపా బాగా దట్టించండి" అన్నాడు అవధాని తక్షణం.

"నాకు మిర్చి వద్దయ్యోయ్! కారం పడదు. ఉల్లిపాయ బాగా తగిలించు"

"చూడయ్యరూ! నాకు పెసరట్టొద్దు గానీ, మళ్ళా ఇడ్లీయే పట్టా దాని బదులు...."

"అయ్యో! రామదాసు పంతులుగారూ!.... ఇత్యాదయః" అంటూ పక పక నవ్వడం ప్రారంభించారు సుబ్రహ్మణ్యంగారు.

పద్మ మాత్రం తపీమని నిర్మొహమాటంగా ప్రశ్న వేసింది. "మరి మీరు నవ్వేస్తున్నారు గాదా - ఆ సుందరం అనేవారు రావడానికి ముందు మీ ఇడ్లీలు తినేస్తూ వాళ్ళ కిప్పించడమేదేం?" అంది.

రామదాసుగారు కళ్ళెర్రచేసి చూశారు పద్మవైపు. సుబ్రహ్మణ్యంగారు నవ్వుతూ జవాబిచ్చారు. "బాగా అడిగావమ్మా. చెబుతావిను, నే నావూరొచ్చిన రోజునే అయ్యరు దగ్గర ఖాతాపెట్టడం-వీళ్ళని మేపడం జరిగింది. ఆ తరువాత మాటల్లో చెప్పేశాను; "మొహమాటం కిమన్నాస్తి! సుబ్రమణ్యేన సన్నిధా" అంటూ అని "ఏమయ్యోయ్! నేను వూరికే బతిమాలలేనూ. మీకు కావల్సించల్లా నిస్సందేహంగా పుచ్చుకోండి" అన్నాను. నాల్రోజులు కామోసు మామూలుగానే పుచ్చుకున్నారు.

"ఏమిటో! మీచేత ఇలా బోలెడు వ్యయం పెట్టించడం మాకేం బావులేదు" అన్నా రొకరోజుని ప్రేవున తేనుస్తూ.

"దాని కేముందయ్యా! నాకు లేని రోజున మీరు పెడుదురుగాని. అంటే ఇపుడు మీకు లేదనికాదు.... పోనీ మీ కంత "మరీ" యిదిగా వుంటే రేపొద్దుటినించీ మీరునాకుపెట్టండి! మనలో మనకేమిటయ్యా!అన్నదమ్ము లంటివాళ్ళం—" అన్నాను. మర్నాడు వాళ్ళు రాలేదు. తరవాత వచ్చినా పుచ్చుకోడం మానేశారు. రేపొద్దున్న నిజంగానే నాకు పెట్టాల్సొస్తుం దేమోనని వాళ్ళ భయం. అంతే-నేను మళ్ళా బతిమాల్లేదు సుమీ....

"అయ్యా సుబ్రహ్మణ్యంగారూ! మీరు మరోలా అనుకోవద్దు కుర్ర దేదో అంది" అని సద్దెయ్య బోయాడు రామదాసుగారు.

"బావుందయ్యోయ్! అంటే మాత్రం తప్పేముంది! మనిద్దరి కంటే అదే నయం. ఉన్నమాటంది. కానీలే. కథ విను-సరే కాఫీలయ్యాక చదరంగంమీద సరదాపడ్డాడు సుందరం. ఆటమీద కబుర్లలో మావాళ్ళ విషయం కనుక్కున్నారు. సుందరం బియ్యే దాకా చదువుకున్నాట్ట. ఏదో చిన్న వర్తకంపెట్టి బాగుపడ్డాడు. కష్టపడి పైకొచ్చాడు కాబట్టి యిప్పుడు వీలైనంత సుఖపడ్డానికి ప్రయత్నిస్తున్నాడేమో ననిపించింది నాకు. "నా" అన్నవాళ్ళు లేరు. ఏదో ఉన్నవూరుచూసి, సొంత కొంపలో నాలుగురోజు లుండి పోదామని వచ్చాడట. ఆఁ!....ఇదీ కథ. ఈ కథ చెప్పేలోగా అతని సిగరెట్టుడబ్బాలో ఇరవై సిగరెట్లు ఉఫ్‌మన్నాయి. "మొత్తంమీద ఎలాగేనా గోల్డు ఫ్లేకు బహు పరిమళమయింది. సుమండీ" అన్నాడు అవధాన్లు డబ్బాలోంచి మరొకటితీసి నోట్లోనూ మరోరెండు జేబుల్లోనూపెట్టుకుంటూ. సాయంత్రానికి చెరువుగట్టునా. రచ్చబండ దగ్గిరా. కరణంగారి అరుగు మీదా ఈ రంగధాముడి విషయమై అత్యున్నత స్థాయిలో వాగ్వివాదాలు జరిగాయి. జోగినాధం, జగన్నాధం. అవధాన్లు, కోదండంతో కూడుకున్న చతుష్టయం కూడా ఈ చర్చల్లో పాల్గొంది. తీవ్రంగా నిరసించారు సుందరం పోకిళ్ళని. ఇలా తమందరికీ యిడ్లీలూ కాఫీలూ యిప్పించడం, తమచేత

సిగరెట్లు తగలేయించడం-ప్రయోజకత్వం కాదన్నారు. బాగుపడి పైకొచ్చే లక్షణం సుతరామూ కాదన్నారు.

తమాషా ఏమిటంటే మర్నాడు పొద్దున్న నేను బెహరా హోటలు దగ్గర కెళ్ళే సరికి జోగినాథం, సుందరాన్ని-యింటి కెళ్ళి పిల్చుకొచ్చాడు స్వయంగా. అందరం చేరాం. తిరిగి యిడ్లీ వ్యవహారం-కథా కమామీషూ ప్రారంభం అయింది. సరే ఆ పైన చదరంగం. రెండాటల తరువాత డబ్బుల మీద ఆట ప్రారంభం అయింది. చతుష్టయం నలుగురూ వరసగా ఆడారు సుందరంతో, ఆటకి పావలా చొప్పున. కాఫీలకు రూపాయి, పం దేలకి రూపాయి ధారపోసుకున్న సుందరం, నవ్వుతూనే యింటికెళ్ళడం చూసి చతుష్టయానికి చిర్రెత్తుకొచ్చింది.

"చూశావోయ్ వాడికి! ఎంత నిర్లక్ష్యం! ఎంత నిర్లక్ష్యం!!" అన్నాడు అవధాని.

నిర్లక్ష్యం అంటా వేమిటోయ్!పొగరను - పొగరు!"

"ఇంకా మెల్లిగా అంటా వేమిటి!"

"అయిన కాడికి డబ్బు గెల్చి వాణ్ణిలా తిట్టుకున్నారు. నాకు వళ్ళు మండింది సుమీ!

"మెల్లిగా అనకపోతే గట్టిగా అంటాడయ్యా! ఒకవేళ వింటే ఆ కుర్రాడు రేపు రాడేమో!" అన్నాను. ఛర్రుమని లేచాడు జగన్నాధం "మే మన్నదాంట్లో తప్పేముందండీ? తనసత్తా ఎదరు సత్తా తెలిసి ఆడద్దూ? డబ్బులున్నాయని ఊహూ ఎగబడ్డమే!" అని.

జోగినాథం అందుకున్నాడు "చూశాను చూశాను. మూడుపావలాలు పోయాకయినా కళ్ళు తెరుస్తాడేమో! ఆట మానేస్తాడేమోనని.అబ్బే!"

"అవి పావలాలనుకున్నాడో చింతపిక్క లనుకున్నాడో" అన్నా డవధాని.. ఏమనుకుంటేనేం! మర్నాడు ఇడ్లీలకీ కాఫీలకీ అంతా తయార

య్యారు. పైగా జోగినాథం బావమరదీ అవధాని మేనల్లుడూ కూడా వచ్చారు.

"అబ్బో! వాళ్ళ కెందుకండీ—చద్దివణ్ణం తిన్నారు"అన్నారు యుగళంగా. సుందరం నవ్వాడు—

"అబ్బ పిల్లబుగదండీ" అని.

"వెర్రి వెధవ—" అనుకున్నారు పెద్దలు.

మళ్ళా చదరంగం ఆడారు. సిగరెట్లు విరివిగా వెలిగాయి, జోగినాథం, దక్కను పెట్టి పల్లీకున పెట్టేశాడు-ఎవడూ ముట్టుకోడనే ధీమాతో. సుందరం చిత్తుగా ఓడిపోయాడు నాలుగుపావలాలూ.

ఊరు గగ్గోలెత్తిపోతోంది—రోజూ అలా రెండురూపాయలు తగలవేసే రంగధాముణ్ణి గురించి. ఇంతేకాదు సుందరం గురించి, ఘోరాతిఘోరమైన పుకార్లు ప్రచారంలో కొచ్చాయి. ముష్టివాళ్ళకి అణా బేడా యిచ్చెయ్యడం, యాయవారం ఆయన్ని సుష్టుగా మేపి పైగా యింటికి పప్పులూ ఉప్పులూ ఇచ్చిపంపడం, పాలేరాళ్ళకీ బడిపంతుళ్ళకీ చొక్కాలూ పంచెలూ ఇచ్చెయ్యడంవంటివి.

"నాకు ఆవకాయ చాలా యిష్టం" అన్నాడు సుందరం ఓనాడు. జగన్నాథంగారు ముందు కురికి చవకలో మాగాయి, ఆవకాయి, మెంతికాయి, నిమ్మకాయి వారి ఆడవాళ్ళచేత పెట్టించి యిచ్చేశారు. ఈ హడావుడిలో, రాకపోకలలో, సుందరం సుబ్బలక్ష్మిని చూడ్డం, పలకరించడం జరిగిపోయింది.

గొల్లుమంది యావత్ప్రజానీకం ఈ వార్తవిని. జగన్నాథంగారి సుబ్బులు సుందరాన్ని పెళ్ళాడుతుందని వార్తలు బయలుదేరాయి. నీలాటిరేవుదగ్గరా, నూతి చప్టాలచుట్టూ, సోమయాజులుగారి చావిట్లో, బహిరంగ సభలు జరిగాయి. పడకగదుల్లో దంపతులు కష్టసుఖాల బదులు సుబ్బలక్ష్మి

సుందరీయం ప్రబంధపఠనం చేసుకునేవారు. సుబ్బులుని తమ తమ కొడుకులకి చేసుకుందామని ఆశలు పెట్టుకున్నవాళ్ళు మండిపడ్డారు. "ఈ పెళ్ళెలా జరుగుతుందో చూస్తాంగా" అన్నారు పెద్దలు.

"కులం గోత్రం సరిపోతేమాత్రం, మనవాడికన్న వాడేం పొడిచేవాడంట?" అన్నారు.

"డబ్బు స్వామీ డబ్బు! ధనమూలమిదం జగత్" అన్నారు.

"ఆఁ ఏం డబ్బులెద్దూ! వెధవడబ్బు, డబ్బుటయ్యా శాశ్వతం; కుక్కని తంతే రాల్తుంది డబ్బు" అన్నాడు ఉమ్మాయి.

"అంతే అంతే! మాట శాశ్వతం. హరిశ్చంద్రుడి కంత పేరెందు కొచ్చిందీ? మాట—డబ్బు కూడా పట్టికెళ్ళాడా ఏం!" అన్నాడు తుమ్మాయి.

"తగ్గవోయ్! ఆ మాటకొస్తే హరిశ్చంద్రుడు పేరుమాత్రం మూటకట్టుకు పోయాడా? డబ్బు ఇక్కడే వుండిపోయింది. పేరు ఇక్కడే వుండి పోయింది" అన్నాడు రణపెంకి జగ్గాయ్.

"రాలుగాయి వెధవా! ఎంత మాటన్నావ్!" అన్నారు ఉమ్మాయీ, తుమ్బాయీ. మర్నాడు జగ్గాయి పట్నంలో పెద్దాసుపత్రికెళ్ళారు— విన్నావా రామదాసూ;

ఇంక ఇటు చూస్తే పెంకిభడవా, సత్యభామా, దొరసానీ,గయ్యాళి గంపా అనే నామాంతరాలు గల సుబ్బలక్ష్మి—అదేం చిత్రమోగానీ— సుందరాన్ని చూస్తే సిగ్గుపడ్డం మొదలెట్టింది! ఆ మధ్య దాపున్నవాళ్ళే— ఇద్దరు ముగ్గురు హృదయాలూ అవీ సమర్పించబోతే నడికుప్పెక్కి ఆడి పోయింది. "అప్రయోజక వెధవా" అని మొదలు పెట్టి యిటు మూడు తరాలూ అటు మూడు తరాలూ ఆడిపోసింది. సుబ్బుల్ని చేసోక్కడానికి ప్రద్యుమ్నుడో వాడిబాబు అష్టనుడో లేక మెత్తగా తన్ని నెగ్గుకు రాగల

ప్రయోజకుడు ఏ మారీచుడో శిశుపాలుడో దిగిరావాలి అనుకునే వారంతా. వాళ్ళమ్మానాన్నా బోల్డు బెంగపడేవారు. అంతే గాదయ్యా మరీ! పెళ్ళీడు పిల్లా! గుండెల్లో కుంపటీ అన్నారు. ఇటు దానికి చూస్తే ఉభయ గోదావరి జిల్లాల్లోని ఆంధ్ర వీర యువకుల్లో ఒక్కడూ నచ్చడాయె. ఆ! అదుగో అలాటి సుబ్బులు కాస్తా పట్నంనుంచి ఊడిపడ్డ సుందరరావుని చూసి సిగ్గుపడ్డం మొదలెట్టిందంటే చిత్రంగాదూ. అతగాడిలో ఏం ప్రయోజకత్వం కనబడిందో ఆవిడకి! పైగా అక్కడితో ఆక్కుండా వాళ్ళింట్లో వంకాయ కూరో, మామిడికాయ పప్పో ఏదో వోటిచేసి రోజూ సుందరం ఇంట్లో ఇచ్చొచ్చేది.

రానురాను జనం ఈ విషయంలో రెండు పార్టీలయి పోయారు. అయితే గియితే ఈవివాహం ఆమోదించే వాళ్ళొక పార్టీ, కూడదనే వాళ్ళు రెండోపార్టీ-ఏదీ ఓచుట్టందుకో రామదాసూ—చేత్రోలు పొగాకా ఏమిటి-

చుట్టంటించి ఒక్క నిమిషం ఆగి ద్విగుణీకృతోత్సాహంతో కథ సాగించారు సుబ్రహ్మణ్యంగారు.

'చివరికి పరిస్థితులెలా పరిణమించాయంటే — ఆ పార్టీల వాళ్ళు ఒకళ్ళ నొకళ్ళు తన్నుకునేందుకు సిద్ధమయారు రహస్యంగా. గూఢచారి ఋలుకూడా బయల్దేరారు. కామాక్షమ్మ, సుబ్బులూ, సుందరం మాట్లాడుకోడం చాలామాట్లు వింది. ఆవిడని చాలా నిరుత్సాహ పరచాయవి. ఆవకాయ, జగన్నాథం నిద్రా, లేసులల్లిక, ఆనపకాయ హల్వా గురించే వాళ్లు మాట్లాడుకునేవారు-పెదవి విరిచిందావిడ నీలాటి రేవ్వరో.

హఠాత్తుగా పిడుగువంటి వార్త వచ్చిపడింది. దాంతో జనం నిద్రా హారాలు వర్జించారు. అందరికీ మతులు పోయాయి. దీన్ని గురించిన కబుర్ల లోటీ ఏకాహాలూ సప్తాహాలూ జరిగాయి. కొట్టుకోడానికి సిద్ధమైన

రెండుపార్టీలవాళ్ళూ ఈదెబ్బతోటి ఏకాభిప్రాయాని కొచ్చేసి స్నేహితులై పోయారు. ఎవరో కవి అన్నట్టూ. "వెయ్యేల?"- ఆ వూళ్ళోపిల్లా మేకా, తాతా అవ్వా, రాయీ రప్పా కూడా ఏకమై, జాతిమత, ధనిక దరిద్ర, స్త్రీ పురుష, సత్ అసత్ విచక్షణ ఎంతమాత్రం లేకుండా ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేశారు.

"సుందరం వెర్రివెధవా, నిష్ప్రయోజకుడూ కాబట్టి చిప్పచేతి కొచ్చి తీర్తుంది! అంచేత సుబ్బుల్ని వాడికివ్వకూడదూ" అని. రామదాసూ, ఇంతకూ అంతటి ఘోరమైన ఆ వార్త ఏమిటని అడగపేం? చెప్తావిను ఆ వార్త యిది; "సుందరం తుమ్మాయికి ముప్పావలా అప్పిచ్చాడు." నవ్వకు నవ్వకు తుమ్మాయంటే ఎవడో నీ కేం తెలుసు. వూళ్ళో వాళ్ళ నడుగు చెబుతారు.

వార్త వినగానే, "అవ్వ హవ్వ" అన్నారంతా, సుందరంమీద జాలిపడ్డారు. అతన్ని అసహ్యంచుకున్నారు. వేళాకోళం చేశారు. జోగి నాధం, అవధానీ, కోదండం, సుబ్బలక్ష్మి తండ్రి జగన్నాధం తాండవమాడిపోయారు. వార్త వినగానే "మా పరువు మంట కలిసిం". దన్నారు. జగన్నాధం హుటాహుటిని సుందరం యింటికెళ్ళి మండిపడ్డా డతని మీద.

"ఏమండీ అంత తప్పా ఇవ్వడం!" అన్నాడు సుందరం అమాయ కంగా.

"తప్పా! తప్పున్నరా! రామ రామ! చూస్తో చూస్తో వాడికెలా యిచ్చావయ్యా? తిరిగి ఇస్తాడనే?" అన్నాడు వెనకనే వచ్చిన జోగినాధం.

"ఎంతో కష్టంలో వుండి అడిగాడు - ఎందుకివ్వడేం?"

"ఆ మాత్రం మాకు తెలీదయ్యా? ఈ వూళ్ళో ఒక్క పిట్ట - ఒక్క గింజ, వాడికి అప్పివ్వదు తెలుసా? తుమ్మాయి అప్పులెగేస్తాడనే విషయం ఈ ఊరి పాపాయిలక్కూడా తెలుసు."

"ఎవ్వరూ అప్పివ్వలేదుకదా! వాడు తిరిగి తీర్చడని మీ కెలా తెలుసు?" అంటూ అడ్డు ప్రశ్న వేశాడు సుందరం.

"తిమ్మన్న పేరు వేరే చెప్పాలా ఏమిటయ్యా! మొహం చూస్తే తెలీదూ! హవ్వ వాడు నీకు అప్పు తీరుస్తాడూ! వేశాడులే టోపీ. తిలోదకా లిచ్చుకో సద్బ్రాహ్మడిని పిలిచి."

సుందరానికి పౌరుషం రేకెత్తుకొచ్చింది.

"సరేలెండి. అందరూ ఇవ్వక పోయినా నేను యిచ్చానన్న విశ్వాసంతో నాది నా కిచ్చేస్తాడు" అన్నాడు.

"ఆఁ! ఇస్తాడిస్తాడు" అని వెక్కిరించాడు కోదండం.

"సుందర్రావు పంతులూ! వాడు నీకు తిరిగి ఆ ముప్పావలా అప్పు తీర్చేస్తే నా కుడి చెవి కోసిస్తా" అన్నాడు జోగినాథం.

"నీ కుడి చెవి నాకెందుకు" అన్నాడు సుందరం.

ఈలోగా అవధాని వెక్కిరించాడు; "ఒస్సీ! చెవి కోసిచ్చేవాడివి నువ్వేనయ్యా! చేవుంటే డబ్బు కాయి పందెం....ఏమయ్యోయ్! సుందరం! —కబుర్లు కాదు. నువ్వు గాని వాడి దగ్గర ఆ అప్పు వసూలు చేస్తే నేను రెండు రూపాయలు పందెం ఓడిపోతా. ఇందుకు సాక్షి సుబ్రహ్మణ్యం గారే." అంటూనే రెండు రూపాయలు నా చేతిలో పెట్టాడు. సుందరం పక పక నవ్వి "సరే కానీండి" అన్నాడు.

ఈమాటు జోగినాథం బెదిరించాడు. "ఓడిపోతావు సుందరం, మానుకో నీ పందెం, లేకపోతే నేనుకూడా కాస్తా" అంటూ.

"కాయండి. ధైర్యమున్న వాళ్ళంతా కాయండి. చేతనైనంత కాయండి" అన్నాడు సుందరం.

"అప్పు వసూలు చెయ్యడాని కాఖరురోజు పౌర్ణమయ్యోయ్! ఇవాళ సప్తమి. జ్ఞాపకముంచుకో." అంటూ జోగినాథం మూడు రూపాయలూ, కోదండం మూడు రూపాయలూ కాశారు.

"చూడు సుందరం! నువ్వు కుర్రాడివి. ఏదో నిన్ను వెర్రివాణ్ణి చేసి డబ్బు దోచుకోడం నాకు సుతరామూ ఇష్టంలేదు. కానీ నీకు నీతి పాఠం చెప్పడానికి నేను కూడా కాస్తున్నా. అయిదు రూపాయలు. సుబ్రహ్మణ్యంగారూ!— ఇంటి కెళ్ళి డబ్బు తెచ్చిస్తా" అన్నాడు జగన్నాథం. ఈలోగా కబురందుకున్న కరణంగారు రెండూ, మునసబుగారు మూడూ, జగ్గయ్య పావలా తెచ్చారు పందేనికి."

చుట్ట కొంచెం ఘాటుగా పీల్చి అవతల పారేశారు సుబ్రహ్మణ్యం గారు. గొంతు సరిచేసుకున్నారు.

"రామదాసూ! చేసిన పాపం చెబితే పోతుందంటారు. అణా డబ్బులకి గొల్లుమనే పల్లెటూర్లో రూపాయిలకి రూపాయిలు ఇంత మంది పందెం కాసేస్తూంటే నాకూ మనసు పుట్టింది సుమా! "నేనో రూపాయి కాశాను సుందరం" అన్నా జంకుతూ. పందాలు మొత్తం పదహారుం బావలా చేరింది నా దగ్గరికి. సుందరం వెంటనే లోపలికెళ్ళి, పదహారుం బావలా తెచ్చి, నా దగ్గర ముడుపుంచాడు— ఆనక పేచీలు రాకుండా.

ఊళ్ళో ఊసుపోని వాళ్ళందరికీ ఉషారు హెచ్చింది. తుమ్మాయి బహు జాగ్రత్తగా తిరుగుతున్నాడు సుందరానికి మొహం చాటేస్తూ. సుందరం మాత్రం నిర్విచారంగా పూలరంగడల్లే నిశ్చలంగా తిరిగేవాడు. మామూలుగానే బెహరా హోటలు, చదరంగం తతంగం సాగిపోతోంది. అంతకన్న మామూలుగా సుబ్బులొస్తూ పోతూ వుంది సుందరం ఇంటికి.

అంతా బావుందిగానీ, ఈ చివరిది ఎవరికీ నచ్చలేదు. ఏది - ఈ సుబ్బులుకి సుందరంమీద మోజు. "ఇదంతా అసలు జగన్నాథం దగ్గరుండి సాగిస్తున్నాడు." అన్నారు పెద్దలు. ఓనాటి సాయంత్రం కరణం గారి అరుగుమీద పేకాట సందర్భంలో జగన్నాథాన్ని నిలేసి అడిగేశారంతా. "ఏమయ్యోయ్, నీ కూతుర్ని ఆ పూలరంగడి కిస్తావనుకుంటున్నారు ఊళ్ళో. నిజమా ఏమిటి కొంపతీసి!" అని.

తారాజువ్వలా లేచాడు జగన్నాథం:—"ఎవడన్నాడయ్యా! అసలు అన్నదెవడూ అంట. వాడిది గుండా చెరువా! ఏమయ్యోయ్ ఒకటే లెక్క. నా కూతుర్ని పాలేరాడికిస్తే ఇంకా సుఖపడ్తుంది. చూసి చూసి ఈ మిడి మిడి రంగడికా యిచ్చేది నేను! నిష్ప్రయోజకుడు. కానీ దాచుకోడం చాతకాదూ: పైగా ఆట రాకపోయినా పెద్దాళ్ళతో చదరంగం ఆడి పందేలు కూడానూ! పోన్లేవయ్యా. అవన్నీ వదిలెయ్. ఆ తుమ్మాయిని - ఆ దగుల్బాజీ తుమ్మాయిని నమ్మి ముష్టావలా అప్పిచ్చిన వెంగళాయిని నా అల్లుడుగా చేసుకుంటానూ! ఛూసి చూసి! - పావలా! అర్థా! ముష్టావలా ఆయె!" అంటూ చిన్న కథాకళీ నృత్యం చేశాడు.

అంతవరకూ నిరాహారంతో పరితపిస్తున్న ఆ వూరిప్రజలు పథ్యం పుచ్చుకోడం ప్రారంభించారు ఆరోజునుంచి - సుబ్బులక్ష్మిని సుందరాని కివ్వడం కల్ల అనే ధీమాతో, ఇంక తుమ్మాయి కథకూడా తేలిపోతే నిద్ర కూడా పోవచ్చు. ఆ యొక్క వాన చినుక్కోసం నోరు తెరుచుక్కూచున్న ముత్తెపు చిప్పలాగా, గడువురోజు పౌర్ణమి కోసం జనం ఎదురు చూడ సాగేరు.

"వేయికళ్ళతో కనిపెట్టి చూసేవారు తుమ్మాయి రాకపోకల్ని. సుందరం తుమ్మాయి ఇంటికెళ్ళనే వెళ్ళడు. ఓరోజు సుందరం షికారుకు బయల్దేరాడు. ఓ సందుమలుపు తిరిగేసరికి ఆ సందులోనే ఒక ఇంట్లో నుంచి బైటికొస్తున్నాడు తుమ్మాయి. సుందరాన్ని అల్లంత దూరంలో

